శ్రీశారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక

కీలక ఆశ్వయుజ కార్తికములు

సంపుటము 57 సంచిక 4



సంపాదకుడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ

కాకరపర్తి కృష్ణశాస్త్రి

సంవత్సరమునకు చందా రు. 3/—

విడిప్రతి 0-60 పైసలు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు :

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు :

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు :

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు, జమీందారు, ఉయ్యూరు.

ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

కా కి నా డ

అ ధ్య క్షు లు

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అ భి న వ భో జ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
6. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
7. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
8. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు
9. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
10. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు
11. శ్రీ చిరువోలు వెంకటరామమూర్తిగారు

# విషయసూచిక

కీలక ఆశ్వయుజ కార్తికములు.

సంపుటము ౫౭ సంచిక ౪

1. చంపకమాల 1

శ్రీమతి యస్. హైమవతి

2. ఆంధ్రశబ్దతత్త్వము - సంధిప్రకరణము 2

శ్రీ రాళ్ళపల్లి సుందరం

3. గాధేయచరితమ్ - ప్రథమః సర్గః 5

శ్రీ దురిశేటి వేంకటరామాచార్యః

4. బట్టుమూర్తి - మూర్తికవి 7

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు

5. తాపోపశమనము 21

విద్వాన్, శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి

6. ఆంధ్రదీక్ష 25

( నాటకము )

7. సాహిత్యచింతామణి 179

శ్రీ రామసుధి

# చంపకమాల

రచయిత్రి:— యన్. హైమవతి

చ. తెలుగుల కొక్కరాష్ట్రమును తీరిచిదిద్ది దివమ్ము చేరినా
రలఘులు నాయకాగ్రణు లహస్కరమూర్తులు; మంత్రులైరి మా
న్యులు ప్రతిభాసమన్వితులు యోగ్యతకల్గిన దండనీతివే
త్తలు; లభియింపవే యిక ముదమ్ము శుభమ్ము యశమ్ము? బుద్ధిమం
తులకు ధరిత్రిలో కొదువ తోచ దటన్న నబద్ధమా నె? ని
శ్చలతకు భూరిదిగ్విజయ సారసమాలిక యబ్బకుండునే?
సలలితపాలనాపటిమ శాశ్వతవైభవ మీయదే? దిసం
తుల విదళించి యాంధ్రులి కుతోభయులై తమవాంఛితమ్ములం
దెలుపుచు కేంద్రపాలకుల దృష్టిపథమ్మున నగ్రగాములై
గెలుపు లనేకముల్ గొని రకించనతన్ నశియింపజేయ, నా
శలను పరిత్యజించిరి, ప్రశస్తములౌ విమలాశయమ్ములన్
కలిగి పురోగమించిరి, ప్రణాళికలన్ విరచించి పేదసా
దలకు సురక్షితస్థితి సదా సమకూర్పగ నున్నతాధికా
రులు జరతాభిలాషలకు లోబడి నీతిని కావ శాసన
మ్ములు పచరించి రందఱకుమోదము పంచగ నిశ్చయించి రీ
కలలు ఫలించునో? కుటిలకార్యసమర్థుల దుష్టవీక్షణ
మ్ములకు కలంగి దుష్ఫలితముల్ విరియించునో? స్వార్థపూరితుల్
కలతలు రేపుచుండిరి— సుగంధిజలమ్మును పంకిలమ్మునన్
చిలుకగ సాహసించు నవినీతిపరుల్ భరతోర్వి శత్రునే
తలకు దురంతవాదులకు దాన మొనర్చ తలంతు రయ్యయో!?
విలువ యెఱింగి త్యాగగుణవిశ్రుతులైన ప్రజాధినాథు లీ
తులువల ధూర్తవైఖరులు తుత్తునియల్ పొనరించి మాతృభూ
తలమును రత్నగర్భయన ధార్మికసుందరనందన మ్మనన్
మలతురు గాక! వేదమతమందసమీరము స్వేచ్ఛతో కెలం
కుల ప్రసరించుగాక నవకుందపరీమళ ముప్పతిల్లగన్.



# ఆంధ్రశబ్దతత్త్వము: సంధిప్రకరణము

—శ్రీ రాళ్ళపల్లి సుందరం

క్రీ. శ. 1900 ప్రాంతమున మదరాసు ప్రెసిడెన్సీ కళాశాలలో గీర్వాణబోధకులుగ నుండిన T. M. శేషగిరిశాస్త్రిగారు 'ఆంధ్రశబ్ద తత్త్వము, అను తెలుఁగు వ్యాకరణమును రచించియున్నారు. ఇది వారి మనుమలు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి (జూనియర్) ముద్రించియున్నారు.

ఈ గ్రంథము రెండు భాగములుగ ముద్రింపబడి యున్నది. ఇందు ద్వితీయభాగమున అక్షరప్రకరణము, పదప్రకరణము, సంధి ప్రకరణము- ఇత్యాది విభాగము లున్నవి. దీనిలో సుమారు ౨౦౦ సూత్రములు రచితములై యున్నవి. దీనిని సాకల్యదృష్టిలో పరిశీలించినపుడు పెక్కుసూత్రములు బాలవ్యాకరణసూత్రముల అనుకరణములై యున్నట్లు తెలియుచున్నది. శేషగిరిశాస్త్రిగారు తమ యాంగ్లోపోద్ఘాతమున 'The Gsrammars of all the Dravi dian Languages are more or less traditional and arbitary and even the sanskrit grammar o? panini is not free from this defect' అని నుడివియున్నారు. వీరు కొన్నియెడల తమిళమున గల మూలరూపము లొసఁగి యుండినను, వీరు రచించినసూత్రములు బాలవ్యాకరణమునం దున్నట్లు హితమితములై పొందికగా లేవు. వానిలో పెక్కు లవ్యాప్త్యతివ్యాప్తిదోషసహితములై యున్నవి.

చాల సందర్భములలో చిన్నయసూరిగారి సూత్రోదాహరణముల నాధారముగ గైకొనిన శాస్త్రిగారు కృతజ్ఞత తెలుపుటయటుంచి చిన్నయసూరి బాలవ్యాకరణమును తమ పూర్వభాగమున (క్రియాప్రకరణము) విమర్శించియున్నారు. వారు చెప్పినమాటలఁ గనుఁడు. "ఆదివైయాకరణు లయిన నన్నయభట్టారకుల వ్యాకరణమును ఆధారముగా గొని రచియింపబడినందున మూలగ్రంథమునం దుండుభ్రంశము లన్నియు వానియందు నున్నవి. నన్నయభట్టారకులే శబ్దస్వరూపములను జక్కఁగఁ దెలిసి కొనక బుద్ధికిఁ దోచినట్లు లక్షణ

ములను జెప్పినారు. వారు భ్రమించి చెప్పినవిషయములను ఇతర వైయాకరణులును ఒప్పులుగానే గ్రహించి తమతమ గ్రంథముల నొనరించినారు."

ఈ వ్యాసమున నేను చర్చింపఁదలచినది యే తద్గ్రంథాంతర్గతమగు (రెండవభాగము) సంధిప్రకరణము.

'సంధి యనఁగా రెండు అక్షరములను జేర్చి యుచ్చరించుట' (సూ 62)- ఇది వారి సంధినిర్వచనము. అచ్సంధుల గుఱించి వచించుచు వారు నిర్వచించినసూత్రము- 'అచ్చున అచ్చు పరం బగునపుడు న,య,ర,ఱ,వ లు బహుళంబుగా ఆగమంబులగు (సూ 66)- ఇందు ఉకారసంధిని గూర్చి చెప్పినసూత్రము.

౧. 'ఉత్తున కచ్చు పరం బగునపుడు లోపం బగు' (సూ. 76). ఈ సూత్రము పాక్షికము మాత్రమే. ఉత్తున కచ్చు పరంబగునపుడు లోప మని నంతనే సంధికరణలన్నియు స్ఫురింపవు కదా! "అచ్చు పరంబగునపుడు లోపంబగునని చెప్పుటచే బరమైనయచ్చు లోపించున నెడి విపరీతార్థము స్ఫురించును. వాఁడు+ఏగెను=అనినపుడు జరుగునవి రెండు కార్యములు. పూర్వ పదాంతస్వరలోపము పరస్వరాదేశము, ఇప్పట్టున సూరి 'ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు'నని సూత్రించి 'పూర్వాపరస్వరంబులను బరస్వరంబే కదేశంబగుట సంధి యనంబడు నని వివరించుట రమణీయము.

౨. 'అత్తునకు సంధి బహుళము' అను సూత్రమును శ్రమించి వివరణప్రాయముగ వీరు సూత్రించినవిధము గనుఁడు. 'అకారమునకు అచ్చు పరంబగునపుడు అకారమునకు లోపమును యకారాగమమును బహుళంబుగనగు (సూ 67). సూరి యొసఁగిన యుదాహరణములలో నిత్యవిధికి నుదాహరణములు లేవు. వీరుకూడ నొసఁగలేదు. సూరి యొసఁగిన మేన+అల్లుఁడు; పుట్టిన+ఇల్లు మాత్రమే యుదహరించిరి. సంధి జరుగదని వృత్తియందు సూరి వ్రాసినదానిని వేఱొకసూత్రముగ

శేషగిరిశాస్త్రిగారు రచించిరి. 'స్త్రీవాచకముల యొక్కయు తత్సమ సంబోధనాంతంబులయొక్కయు అంతాకారంబునకు లోపము లేదు.' (సూ. 68) అమ్మ+ఇచ్చెను. దూత+ఇతఁడు; ప్రియుండ+వగుము; ఉదహరించిరి. గంగనుకాసి, నెలలిచ్చెను, శ్రీరంగభర్తంచు మొదలగు ప్రయోగములనుగూర్చి వా రేమియు వచింపలేదు. సూరి 'పూర్వకార్యములందు మృగ్యంబు' అని వ్రాసెను. కాని శ్రీ గిడుగు రామూర్తిపంతులు 'బాలకవిశరణ్యము'న రెండు ప్రయోగములను జూపిరి. మాయ+అను = మాయను (రంగనాథరామాయణము); ప్రేత+అయి=ప్రేతయి (పద్మపురాణము). చిన్నయసూరి యథర్వణాచార్యులు చెప్పిన విషయమునైన నుట్టంగించిరి గాని, వీ రుపేక్షించిరి.

3. వీరిసూత్రములు కొన్ని, చిన్నయసూరి సూత్రములను వివరణప్రాయములు, 'ప్రథమావిభక్త్యంతములకు పరమయిన పరుషములకు గసడదవలు బహుళముగా నాదేశంబు లగును.' (సూ. 77). "తెనుఁగుపదములకంటె బరమయిన సంస్కృతపదంబులయం దుండు కచటతపలు గసడదవలు రావు' (సూ. 78) 'ద్వంద్వసమాసమునందు పూర్వపదాంతస్వరమునకు పరమయిన పరుషములకు గసడదవలు ఆదేశంబు లగును.' (సూ. 79) వ్యాకరణమున సూత్రములు వ్రాయుపద్ధతి యిది కాదు. ఈ సూత్రములకు సమములైన బాలవ్యాకరణసూత్రములను బరిశీలించినపు డిది తెల్లము గాకపోదు.

౪. బాలవ్యాకరణమున చిన్నయసూరి సంధి. ౧౬, ౧౭ సూత్రములలో చెప్పినదానిని వీ రొకేసూత్రమున వచించియున్నారు. 'ద్రుతప్రకృతికముయొక్క అంతనకారమునకు పరముగ వచ్చు పరుషములకు సరళంబులు ఆదేశంబులగు ఆదేశము లయిన సరళములకుముందు నకారమునకు సంశ్లేషమును అనుస్వారాదేశమును, స్వత్వంబును పాక్షికముగ నగును'. (సూ. 83). ఈ సూత్రనిర్మాణమునకును బాలవ్యాకరణసూత్రనిర్మాణమునకును గలభేదము నరయుఁడు.

వీరి సూత్రములకును, సూరిసూత్రములకును గలభేదము నర యుటకు పై యుదాహృతులు చాలును. వ్యర్థపదములు లేక, కంఠస్థము చేయుటకు తగినట్లుగను, నవ్యాప్త్యతివ్యాప్తిదోషము లెక్కువ లేకుండగను రచియించుట యొక్కసూరికే చెల్లినది. చిన్నయసూరి సంస్కృతవ్యాకరణమర్యాద ననుసరించి వ్రాసినంతమాత్రమున బాల వ్యాకరణమును తీసివేయజాలము. శ్రీ శేషగిరిశాస్త్రిగారు తమ సంధి సూత్రములలో నెచ్చటను సంధికలిపినట్లు కనము, విసంధులే యెక్కువ. (ఉత్తుమీద, గూడ). వ్యాసములలో విసంధి తప్పులే దనుకొనినను, కనీసము సంధిపరిచ్ఛేదముననైన విసంధి విసర్జనీయ మని నా తలపు. తెలుఁగుపదములకు గొన్నిటికి తమిళమూలరూపమున నరయుటకు నీ గ్రంథ ముపయోగించును.



## గాధేయచరితమ్ - ప్రథమః సర్గః

శ్రీ దురిశేటి వేంకటరామాచార్యః

( గ్రీష్మసంచికానంతరమ్ )

అవిశ్రాంతం రాజకార్యవ్యాపృతేన దివానిశమ్
మానసే నాథ రాజానం రంజయన్ మధు రాగతిః. 61

అవచిక్యే పాండురాణి పత్రాణి శిశిర స్తరా
తత్రైవాయం మధూ రక్తం పల్లవం పర్యధాపయత్. 62

ప్రాహిణో న్మధు రాత్మీయం మిత్రం మలయమారుతమ్
యోఽలం పల్లవితం కర్తుం రాగా త్తరుణయో ర్మనః. 63

యూనాం మన స్వింగితాని విడంబయితుకామయా
జ్యోతిష్మత్యా హి లతయా ధృతా భంగాః పయోముచామ్. 64

ప్రతిద్రుమం ప్రతిలతం పల్లవం సమజాయత
రక్తం పల్లవితం యూనా మివాభినవ మున్మనః. 65

పుష్పవత్యో రజోమత్యో లతా రామా ఇవాఖిలాః
అనుక్షణం విచగతాం మధుపానాం సుఖప్రదాః 66

ఖండితామానసాఖర్వ గర్వనిర్వాపణక్షమమ్
అరవిందం వికసితం యశ స్తస్యేవ భూభృతః. 67
వినాశోకః కుసుమితో యువతీపాదతాడనమ్
ప్రియస్య పాదపతనం వినైవ ముదితా హి సా. 68
చూతం ప్రసూనం ధృతవాన్ రామాయావనయావనమ్
మధునః కలకంఠస్య కలకంఠస్య కారణమ్. 69
నవమల్లీ సుమవ్యాజా ద్ధసంతీ మాం రుషా యుతామ్
ఇతి మత్త్వేవ తరుణీ ప్రణయే నైక్షత ప్రియమ్. 70
నీలోత్పలాని యువతీనయనాని చ రేజిరే
పరస్పరతులాం ప్రాప్య దిదృక్షూణాం మనోహరమ్. 71
శుకైః పికైః శారికై శ్చేందిందిరై రిక్షుధన్వినా
పంచబాణైః సమాయాతః సన్నద్ధో మకరధ్వజః. 72
తథావిధే మధౌ తత్ర యువాన స్తరుణీసఖాః
రమన్తే స్మావినాభావం వనే షూపవనేషు చ. 73
దివి నిర్గతమేఘాయాం చిత్రయా సహితః శశీ
భువి ప్రఫుల్లపుష్పాయాం రేజేఽసౌ మహిపీసఖః. 74
కుముదా న్యక్షిణి పౌరాణాం నిష్కలంకో దివానిశమ్
వికాసయ న్నయం రాజా రరా జాక్షయవృద్ధిమాన్. 74
యథా మధౌ తథా శ్రీమాం త్సహదారః సహప్రజః
సర్వే ష్వృతు ష్వసౌ తం త మార్తవం సుఖ మన్వభూత్ 76
శరదాం శతా న్యనేకాని నయయన్ శత్రుసూదనః
శతం పుత్రా న్నాప రాజా సర్వధాత్మగుణాన్వితాన్. 77
ఇతి శైలోరగరాజ కచ్ఛపదిశాకుంభీంద్రసారే భుజే
చతురంభోనిధిమేఖలాం నదనదీహారాం భువం లాలయన్
తతనీహారపటీరభాసురయశఃపూరై ర్హిమక్ష్మాధర
స్థితసర్వజ్ఞశిరఃకలాం ధవలయన్ రాజా శశాస ప్రజాః. 78

ఇతి

ప్రథమః సర్గః.

# బట్టుమూర్తి — మూర్తికవి

శ్రీ వేకుమళ్ల కామేశ్వరరావు, బి. ఏ. బి. ఇడి.,

తెలుఁగు వాఙ్మయములో ప్రఖ్యాతి చెందినకవులలో రామరాజ భూషణుఁ డొకఁడు. అతఁడు ప్రాచీనకవి గాక మధ్యయుగపువాఁడు. అయినను అతనినిగుఱించి కొన్నిసమస్య లున్నవి. అతని బిరుదనామము రామరాజభూషణుఁ డగుటచేత, తలిదండ్రులు పెట్టినపే రేమి ? అదే మొదటిసమస్య. దానికి ముందుగా, అతని స్వస్థల మే మనున దొక ప్రశ్న. అవి యట్లుండగా, మూర్తికవి యనున దతని సొంతపే రనియు, రామరాజభూషణుఁ డనునది బిరు దనియు హేమాహేమీలుగూడ చెప్పుచున్నారు. వీటి నిజానిజములు తీవ్రపరిశోధనను గోరుచున్నవి; త్రివ్వి చూచెదము.

రామరాజభూషణుఁడు వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యాన ప్రబంధముల కర్త కాగా; మూర్తికవిపేర నరసభూపాలీయ మను కావ్యాలంకారసంగ్రహ మున్నది. అది యొక శాస్త్రకావ్యము.

ఆ పద్యగ్రంథముల గద్యము లిట్లున్నవి—

1. "ఇది శ్రీరామచంద్ర చరణారవిందవందన, పవననందన ప్రసాదసమాసాదిత, సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష, చతుర్విధకవితానిర్వాహక, సాహిత్యరసపోషణ, రామరాజభూషణ ప్రణీతంబైన వసుచరిత్రంబునందు"-

2. గద్య మంతయు పై దానివలె నుండి కడపట పుస్తకముపేరు మాత్రము "హరిశ్చంద్రనలోపాఖ్యానంబు" అని యున్నది.

3. "ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధ, కవితాసార, సారస్వతా లంకార, నిరంకుశప్రతిభాధురంధర, ప్రబంధపఠనరచనాధురంధర, ప్రబంధాంక వేంకటరాయభూషణసుపుత్ర, తిమ్మరాజపౌత్ర, సకలభాషా విశేష, నిరుపమావధాన, శారదామూర్తి, మూర్తిప్రణీతం బైన కావ్యాలంకారసంగ్రహంబును-

ఆ గ్రంథత్రయములోని చారిత్రకాంశములను క్రమముగాఁ బరీక్షించెదము. ఆనాటిచరిత్రను సాకల్యముగా నెఱుఁగకుండ విమర్శకుఁ బూనుకొనుట, మార్గమెఱుగకుండ అడవిలోకి దూరుటవంటిది. కాబట్టి సమకాలచరిత్రను తెలుసుకొనెదము.

## 1. కృష్ణదేవరాయల కడపటిరోజులు.

దక్షిణహిందూసామ్రాజ్యము కృష్ణదేవరాయల నాఁడు అత్యున్నతదశలో నుండినది. ఆ మహారాజునకు నిద్దఱు కూతుండ్రు, ఒక కుమారుఁడు. కుమారుఁ డైనతిరుమలరాయల వృద్ధిని గుఱించి యామహారాజు కలలుగన్నాఁడు. కాని విధి వేఱుగా నున్నది. ఆ బాలుఁడు పసితనములోనె మరణించినాఁడు. కృష్ణరాయలకు మతిపోయిన ట్లైనది. కొన్నిటిలో ప్రవర్తించకూడని విధముగా ప్రవర్తించినాఁడు.

అతని పెద్దకుమార్తె యైన తిరుమలాంబ ఆర్వీటిరామరాయల భార్య. అతఁడే అళియరామరాయలు. అతనివయస్సెంత ? అతనికి 1565 నాటికి తొంబదియారు సంవత్సరము లని యొకసిద్ధాంతము. అప్పటికి నాతనిజన్మ క్రీ. శ. 1469 యగును. కృష్ణదేవరాయల జననము క్రీ. శ. 1487 అని కొందఱ అనుచున్నారు. కాబట్టి మామగారి కంటె అల్లుఁడు పెద్దవాఁ డగును. అది సబబుగా గనఁబడదు కదా! 1565 నాటి తళ్లికోటయుద్ధములో రామరాజు మరణించెను. అప్పటికి అతనివయస్సు 65 అని భావించినయెడల, అతని జననము క్రీ. శ. 1500 అగును. అతనికంటె చిన్నవాఁడు అతనితమ్ముఁడు తిరుమలరాయలు. అతనిజన్మ క్రీ. శ. 1505 అని తలప వచ్చును. కృష్ణరాయల రెండవ కుమార్తె పేరు కృష్ణాంబ. ఆమెయొక్క భర్త మట్లవరదరాజు.

రామరాజు తమ్ముఁ డైనతిరుమలదేవరాయఁడె రామరాజభూషణుఁడు రచించిన వసుచరిత్ర ప్రబంధమునకు కృతిపతి.

విజయనగరసామ్రాజ్యవిచ్ఛిన్నకరశక్తులు కొన్ని కృష్ణదేవరాయనికాలములోనె తల లెత్తినవి. అది బహువిచారకరము. ఆనాటి [1]కొన్ని శాసనములలోని ప్రశస్తులను జూచెదము. (శకసంఖ్యకు ప్రక్కనె క్రీస్తుశక సంఖ్యనుగూడ తెలియజేసినాను.)

1. ...స్వస్తిశ్రీ...శక 1448 (క్రీ. శ. 1526) ...శ్రీ మద్రాజాధిరాజ, రాజకంఠీరవ, రాజకందర్ప, మహారాజాధిరాజపరమేశ్వర రాజపూజితు లగు మహారాజశ్రీ రామరాజయ్యగారు విజయనగర సింహాసనమున పృథ్వీసామ్రాజ్యము చేయుచుండగాను...

2. స్వస్తిశ్రీ శక 1446 (క్రీ. శ. 1524)...శ్రీమాన్ మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, శ్రీవీరభుజబలప్రతాపగజపతి, అశ్వపతిభాడ శ్రీకృష్ణదేవమహారాయ ఉదరాబ్ధిచంద్ర శ్రీ తిరుమలదేవమహారాయన...

3. [2]అచ్యుతదేవమహారాయలువారు విజయనగరమందు వజ్రసింహాసనారూఢులై......

పై వారి శాసనములు మఱికొన్నిగూడ నల్లై యున్నవి. తిరుమలుని శాసనము మఱియొకటి ఆ సంవత్సరముదె యున్నది. అచ్యుతుని క్రీ. శ. 1528, 1529 నాటివి యున్నవి.

పైనఁ జూపిన అళియరామరాయల, తిరుమలదేవరాయల, అచ్యుతరాయల శాసనములను జూచి చరిత్రపరిశోధకులు, కృష్ణదేవరాయలు మరణించియుండుటచేత, వారు మహారాజులైరని తలచుచు, కృష్ణదేవరాయలయొక్క మరికొన్ని శాసనములను బరిశీలించి, ఇంకను

1. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారి లక్ష్మణరాయవ్యాసావళి (1923) పుటలు 49,50 (ఆ వ్యాసము చాలవఱకు ఆంధ్రకవి తరంగిణి సం 7 పు 173-179 లో పునర్ముద్రితము.)

2. బిరుదుగల శాసనభాగము చెడిపోయినది. అయితే మరికొన్ని శాసనములును, లక్ష్మణరావుగారి యభిప్రాయముతో నేకీభవించు వ్యాసము ఆంధ్రేతిహాస పరిశోధకమండలి భా 1 పుట 58 లో నున్నది.

అతఁడు బ్రతికే యున్నాఁడని విశ్వసించుచున్నారు. అట్లు రాజధానిలో బహు మహారాజులును, చక్రవర్తులును బయలుదేరిరి. వీరికి నెవ్వరు పట్టాభిషేకము చేసిరి? అవి అక్రమశక్తులు మాత్రమె. కాఁబట్టి బిరుదములను జూచి చెప్పలేనిదుస్థితి యేర్పడినది. అట్లు కృష్ణరాయలనాడె బహునాయకత్వము మొలకెత్తినది. పోనుపోను అది ముదిరి సామ్రాజ్యాలయము నెట్లు నాశనము చేసినదో క్రమముగా జూచెదము.

ఆర్వీటి అళియరామరాయలకు మొదటినుండియు పెనుగొండయె పట్టుగొమ్మ. అతఁడు పెనుగొండకు రాజని 1526 నాటి[3] యొక శాసనములోఁ జెప్పబడినది.

2. సామ్రాజ్య జీర్ణదశ

కృష్ణదేవరాయని యనంతరము అచ్యుతదేవరాయలు (క్రీ. శ. 1530–42) సామ్రాజ్య పరిపాలకుఁడాయెను. అతఁడు వివేకశూన్యుఁడు. విజాపురము సుల్తానైన ఇస్మాయిల్ ఆదిల్ షాహా 1531 లో రాయచూరు, ముద్గలుకోటలను వశపఱచుకొన్నాడు. అంతేకాక అచ్యుతరాయలే తనరాజ్యములోని యంతఃకలహములను అడ్డగించుటకోసము. ఆదిల్ షాహా సాయమును గోరి, అతనికి గొప్ప బహుమానముల నిచ్చెను. గోల్కొండనవాబైన కులీకుతుబ్ షా కొండవీటిని జయించినాడు. ఇస్మాయిల్ యొక్క కొడుకైన ఇబ్రాహిం ఆదిల్ షాహా హోసపేటను (నాగలాపురము) నాశనముచేసి, విజయనగరముమీదికి దండెత్తగా (1535–36), అచ్యుతరాయలు అతనికి పెద్దలంచమిచ్చెను. కాని యతఁడు వదలక ఆదోనికోటను జయించెను. అంతట రామరాయలు ఆదోనిని విడిపించుటకోసము తన తమ్ముఁడైన వెంకటాద్రినిఁ బంపెను. [4]కాని యతఁడు ఓడిపోయి తిరిగి వచ్చినాడు. అట్టి పరిస్థితులలో శత్రువులు పెనుగొండ, గుత్తి, కర్నూలులనుగూడ నాక్రమించుకొనిరి.

---

3. ఆంధ్రకవి తరంగిణి (చాగంటి శేషయ్యగారు రచించినది) సం 7-179.
4. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి సం 17-187

అచ్యుతరాయలు నిర్వీర్యుఁడై యుండగా రాజధానిలో రెండు కక్షలు బయలుదేరినవి. అతని బావమఱదియైన సలకము చినతిమ్మయ్యది ఒకటి. అళియరామరాజుది రెండవది. వారిద్దఱును ఎత్తుపైయెత్తు వేయుచుండిరి. ఇది అంతరంగికాశాంతి.

పడమటితీరముననున్న పోర్చుగీసువారు వర్తకముకోసము కోటలను గట్టుకొనిరి. తిరుపతిలోని ఖజానాను కొల్లగొట్టుటకోసము నౌకాదళమును తయారుచేసిరి. (క్రీ. శ. 1545). కాని కారణాంతరములవల్ల నది కొనసాగలేదు. దానికి బదులుగా కొన్ని దేవాలయములను కొల్లగొట్టి ధ్వంసముచేసిరి.

విజయనగరసంస్థానము కడు హీనస్థితిలో నుండినది. అంతశ్శత్రువులు, బహిశ్శత్రువులు మిక్కుటమైనారు. రాజధానిలో నందఱును గొప్పరాజులే. రాజాస్థానము ఆడమళయాళముగా నుండినది. భోగస్త్రీలు, వారి యాటపాటలు, అవినీతి విచ్చలవిడిగా నుండినవి.[5] అచ్యుతరాయల అంతఃపురములో యేబదివేలమంది పరిచారకులు. అతని భార్యలు అయిదువందలమంది! ఇంకను అనేకరకములైన ఆడపటాలమున్నది! పరిపాలకులలో శైవభక్తి తగ్గి వైష్ణవము ముదిరినది. కవులకు ఆత్మగౌరవము పూజ్యమైనది. కొందఱు కవులకు నామధారణమవసరమైనది. ఆనాటి హీనదశను తలచుకొని [5a]బైచరాజు వెంటనాథుఁడిట్లు విలపించినాడు-

ఆ. వె. వెల్లివిరిసె పెంటివిద్యలు; మగవిద్య
లడుగువట్టి, క్రిందువడిరి బుధులు;
హీనజాతి పురుషులెచ్చిరి; యాచింప
బోవు టెట్లు నేటి భూమిపతుల ? (పంచతంత్రము 2-132)

5. మహమ్మదీయ మహాయుగము (కొమర్రాజు లక్ష్మణరావుగారు) పుట 388.

5ఏ. వెంకటనాథకవి 1550-60 మధ్య పంచతంత్రకావ్యము నిర్మించినాడని చిలుకూరి నారాయణరావుగారి యభిప్రాయము (భారతి 1941 జూన్. పు 630). కాని యతఁడు ఇంకను పూర్వుఁడని చెప్పెడి యైతిహ్యములున్నవి.

అళియరామరాయలు సామ్రాజ్యము నుద్ధరింపఁ బద్ధకంకణుఁడైనాఁడు. అతని సామ్రాజ్యోద్ధరణను తెలుసికొనవలసియున్నది.

విజయనగరరాజ్యము దుర్గతియట్లుండగా [6]"తళ్ళికోటయుద్ధమునకు (క్రీ. శ. 1565) ముందుఁ గర్ణాటకరాజ్యము క్షీణింపలేదు, పునరుద్ధరణమేల?" అని వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులుగారు ప్రశ్నించుచున్నారు. అట్టి దురభిప్రాయమె విమర్శకులను తప్పుదారి పట్టించినది; వసుచరిత్ర గ్రంథరచనాకాల నిర్ణయమును చెడగొట్టినది.

### 3. ఉద్ధరణ ప్రారంభము

1542 లో అచ్యుతదేవరాయలు మరణించి సుఖపడినాఁడు. అతని కుమారుఁడు వెంకటాద్రి పసివాఁడు. అతని మేనమామ సలకము చిన తిమ్మరాజు ఆ పసిబాలుని తొలగించి, సింహాసనము నాక్రమించుకొనఁ దలపెట్టినాఁడు. కాని ఆ బిడ్డని తల్లియు, చిన తిమ్మరాజు సోదరియు నగు వరదాంబ యా దౌష్ట్యమున కంగీకరింపలేదు. ఆమె బిజాపురపు సుల్తాన్ యొక్క సహాయమును కోరినది. రాజధానిలో నమ్మకస్తులు లేరని కాఁబోలు ఆమె యూహ. అయితే సుల్తాన్ సేనలను చిన తిమ్మరాజు ఎదిరించి, యోడించినాఁడు. సింహాసనము నధిష్ఠించినాఁడు. పిమ్మట మేనల్లుని తుదముట్టించినాఁడు ! అతిఘోరము !

అట్లు అసలు హక్కుదారుఁడు అంతరించగా, అళియరామరాజు తన హక్కును ప్రకటింపఁదలచుకొన్నాఁడు. తన పట్టాభిషేకమును గోరి కార్యరంగములోకి దూకినాఁడు. దానిలో చిక్కులు బోధపడినవి.

పెనుగొండ, ఆదవాని, గుత్తి మొదలైన దుర్గములు నవాబుల చేతులలో నున్నవి. విజయనగరములోని పరిస్థితులు విషమించితే, రామరాజునకు పారిపోవుటకొక రక్షణస్థాన ముండవలెను. తనకు అది

6. వసుచరిత్ర విమర్శనము (వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రులుగారు వ్రాసినది) 1915, పుట 118.

వేఱుకు ఆశ్రియముగా నుండిన పెనుగొండ ప్రిహితఖాన్ అనువాని చేతులలో నున్నది. దానిని విడిపింపవలెను. ఆ ఖాన్‌ను అక్కడినుండి తరమగొట్టవలెను. రామరాజు, తన సోదరుల సహాయముతో పెనుగొండ, ఆదవానిదుర్గముల నెదిరించి వశపఱచుకొన్నాడు. అట్టితయారీ సలకము చినతిమ్మయతో యుద్ధము కొసమె. అయితే సలకము నెదిరించుట ముందా లేక పై కోటలను విడిపించుట ముందా యను చర్చ లేకపోలేదు. ఆనాటి కవులు అప్పటి ఘటనల నెట్లు వర్ణించిరో చూచెదము.

అందుగుల వెంకయకవి (క్రీ. శ. 1630) రామరాజీయమను నరపతివిజయప్రిబంధములో నిట్లు వ్రిసినాడు.

గీ. అవని నిలువలెఁ బుత్రిపౌత్రాభివృద్ధి
రహిని వర్ధిల్లు తిరుమల రాయ వేంక
టాద్రి రాజానుజద్వయు మధికభక్తి
గొలువ నళిరామ భూపాలుఁ డలరుమిగుల.

(ప. 27ర)

గీ. సకలవిభు తిమ్మరాజుసేనలను దుృంచి
గుత్తిఁబెనుకొండ, మఱి గండికోట, గంద
నోలుపుర, మాదవని నవలగెలిచి,
తొలుదొలుత రామనృపు దోర్బలము మెఱసె. (ప 278)

రామరాజునకు 'పెనుగొండ దుర్గసాధకుఁడు', 'ఆదవేని దుర్గపహార. కుఁడు'ను బిరుదులున్నవని యీ గ్రంథములోఁ దెలుపఁబడినది గుత్తిదుర్గములో సదాశివరాయలు బంధింపబడియుండగా, రామరాయ లాతనిని విడిపించి, తనవెంటఁ బెట్టుకొన్నాడు.

వసుచరిత్రి కర్త రచన శ్లేషతోఁ గూడినది. అట్టి రచనలో నన్నిదుర్గముల పేర్లిముడవు. కాఁబట్టి యతఁడు పెనుగొండ, ఆదవని విజయములను మాత్రిమె యిట్లు తెలిపినాడు-

సీ. పట్టాభిషేక విపర్యయంబునఁ బోరిలు
వెడలిప్రియానుజుల్ వెంటగొలువఁ
జిత్రకూటాభిఖ్యఁ జెలఁగుపెన్గొండ, సాం
ద్రహరి ద్విపేంద్రనాదవనిజెంది,
ఖలజనస్థానవాసుల బల్విరవధించి
మహిను సకలఖరస్మయమడంచి (ఆ 1-43).

రాముని యర్థమును విడిచి రామరాజు పరమైన యర్థమును జూడ వలసియున్నది. రామరాజు తాను దలపెట్టిన తన పట్టాభిషేకము విఫల మైనది. సోదరులతోఁ గూడి పెనుగొండ, ఆదవానిదుర్గములఁ గెల్చు కొన్నాడు. ఖలులస్థానము ఆనాటి విజయనగరము. సకలము వాని పక్షమున నున్నవారు ఖలులు. చిన తిమ్మయ్యను ధ్వంసము చేసినారు.

రామరాజు రంగపరాజకవి 1550 ప్రాంతములో సాంబో పాఖ్యానప్రబంధమును రచించినాడు. దానిలో అళియరామరాజు-

మ, మహినెవ్వారెన సల్కరాజు చిన తిమ్మక్ష్మాపకంఠారుణాం
బుహావిశ్చర్వణ తర్పితాసిశిఖం, • • •
గర్ణాటకైశ్వర్య నిర్వహణారార్య భుజధ్వజాయుధపరీ
వారుండు రామప్పకున్.

అని స్తుతింపఁబడినాడు.

6a రత్నాకర గోపాలకవి (క్రీ. శ. 1550 ప్రాంతము.)

6b క్లాగంధికాప్రసవాపహరణమను ద్విపదకావ్యమును సృష్టించి రావెల్ల రెండవలింగకవి తండ్రియైన అయ్యపనాయకుఁడు అళియరామ రాయని తలలోని మానికమట ! లింగన "పెనుగొండకు దోవలు

6ఏ. కుందూరి ఈశ్వరదత్తుగారు ఆ. సా. ప. ప. సం 25-6 లో సౌగంధికా ప్రసవాపహరణము, ఆంధ్రేతిహాసపరిశోధకమండలి సం 10 పు 222-224 నను వ్యాస ములు వ్రాసిరి.

6బి. అదే పేరుగల సంస్కృతగ్రంథమొకటి విశ్వనాథునిచే రచింపఁబడినది. ఆ. సా. ప. ప. సం 25-255.

చూపినవాడు; ఆదవాని దుర్గాపహరణుఁడు". అట్లు తండ్రి కొడుకులు యుద్ధములలో సాయపడినారు.

రామరాయలు అంతటితో నూరుకొనక, తన సోదరుఁడైన దిరుమలరాయనికి పెనుగొండలో (1542-43) పట్టాభిషేక మొనర్చి నాడు. వాని కుమారుఁడైన శ్రీరంగరాయలు యువరాజైనాడు (వసు ఆ 1-77). అది ప్రధానముగా రాజకీయతంత్రము. సలకము చిన తిమ్మయ్య ముఖ్యపట్టణములో సింహాసనాసీనుఁడు కాగా, రామరా యలు పోటిప్రభుత్వము స్థాపించినట్లుగా తిరుమలరాయనికి పట్టాభి షేకము చేసినాడు. (ఆ 1-52). దానిని స్థానికపట్టాభిషేకముగానైనను భావించి సంతోషింపవచ్చును. అవసరమైన సహాయము పెనుగొండ నుండి పొందవచ్చును. అదంతయు ముందు జరుగబోయెడి కార్యము నకు పూర్వరంగము.

రామరాజు తన బలగముయొక్క సాయమును గోరినాడు. విజయనగరమును చేరుకొన్నాడు. సలకము వానిమీద ధ్వజమెత్తి, హతమార్చినాడు. అట్లు రామరాజు జయము పొందినాడు. కాని సింహాసనముమీద ఆశను విడిచినాడు. సదాశివరాయలను గూర్చుండఁ బెట్టినాడు. తాను జీవితాంతము వఱకునుమహాప్రధాని, నియంతపద వులను మాత్రమె చేఁబట్టినాడు. ఆనాటి కవుల వాగ్ధోరణి నిఁ జూచెదము-

నరసభూపాలీయకవి-

సీ. ఖలునతిద్రోహి సల్కయతిమ్మనిహరించి,
సకలకర్ణాటదేశంబు నిలిపె

♦ ♦ ♦

గీ. అవనియంతయు రామరాజ్యంబు సేసె

♦ ♦ ♦

భూమి నొకరాజ మాత్రుండె రామవిభుఁడు

(నరస ఆ 1-82)

క్రీ. శ. 1550 ప్రాంతములో పద్యభాగవతమును వ్రాసిన దోనూరి కోనేరుకవి—

ఉ...... విద్యాపురియందు జాలఘనుఁడయ్యె సదాశివరాజ్య సం
స్థాపకుఁడై సిరంగ వసుధావరు రామనరేంద్రుఁడున్నతిన్.

అని పలికినాడు. ఇప్పుడు మఱియొక ముఖ్యప్రశ్ననుఁ జూచెదము.

## 4. పేరు

కొందఱు విమర్శకులు తిరుమలరాయని పేరులోని భేదమును పెద్దదిచేసి, కాలనిర్ణయమున కదియొక సాధనమనుకొనుచున్నారు. నరసభూపాలీయకవి తిరుమలరాయనిని ఎఱతిమ్మరాజు (నరస 1-84) అని పేర్కొన్నాడు. అట్లె సాంబోపాఖ్యానకవి యాతనిని "గుత్తెఱ తిమ్మరాజన్నాడు. తిరుమలరాయఁడు సింహాసనారూఢుఁడుగాక పూర్వము ఎఱతిమ్మరాజుగానుండి, సింహాసన మెక్కినపిదప తిరుమలరాయ నామధారియైనాడని [6]కొందఱు భ్రమపడి, రాయలు అను పదము కాలనిర్ణయమున కనుకూలముగా నున్నదని సంతోషపడుచున్నారు. అది వ్యర్థము. మహాఘనుఁడైన అళియరామరాజులు 'రామప్ప' యనియె సాంబోపాఖ్యానములోఁ బిలువఁబడియుండుటను మనము చూచితిమికదా! కాఁబట్టి పేరు కాలనిర్ణయమునకు తోడ్పడుట లేదు. వారి వంశములో తిమ్మరాజు లిద్దఱున్నారు, ఒకఁడు నల్లతిమ్మరాజు, మఱియొకఁడు ఎఱ్ఱతిమ్మరాజు. కవులు ఆ పేర్లను ఇష్టమువచ్చినట్లుగా వాడుచుండిరి. అంతే.

## ౫. పట్టాభిషేకము

తిరుమలరాయనికి నెప్పుడు పట్టాభిషేకమైనది యనునది బహు ముఖ్యమైన ప్రశ్న. దానిమీద నాధారపడియె విమర్శకులు వసుచరిత్ర రచనాకాలమును నిర్ణయించుచున్నారు. తిరుమలరాయనికి పట్టాభిషేక

6సి. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి సం 8-3 పు 243.

మైనట్లుగా వసుచరిత్రకారుఁడు వ్రాసినాడు. (ఆ 1-62). అయితే అది యెప్పుడు? రామరాజు పెనుగొండను జయించినవెంటనె రాజకీయపు టెత్తుగా 1543 లో తన తమ్మునికి పెనుగొండయందె పట్టాభిషేకము గావించినాడు. సదా శివరాయలు సామ్రాజ్యమునకు చక్రవర్తి కదా!

వసుచరిత్రలోని పై పద్యమునందు, తళ్ళికోట (1565) యుద్ధానంతరము తిరుమలరాయలు విజయనగరరాజ్యమున కంతకును పట్టాభిషేకము చేసుకొన్నాడని కొందఱు విమర్శకులు వాదించుచున్నారు. అది నిజమా? ఆ యుద్ధమునకు పిమ్మట తిరుమలరాయఁడు సదాశివరాయలను వెంటబెట్టుకొనియె తిరుగుచుండెను. సదాశివరాయలు చక్రవర్తియని యెల్లరెఱుఁగుదురు. ఇంక తిరుమలరాయని కేమి పట్టాభిషేకము? సదాశివరాయల మరణమునకుఁ బిమ్మట తిరుమలరాయలు విజయనగర రాజ్యాధిపతి యయ్యెనని యెవ్వరైన వాదనకుఁ బూనుకొనవచ్చును. కాని దానికిగూడ నొకపెద్ద యభ్యంతరమున్నది. సదాశివరాయలు క్రీ. శ. 1586 దాక బ్రతికియున్నట్లు [7]శాసనములున్నవి. తిరుమలరాయఁడు క్రీ. శ. 1575 నాటికె మరణించినట్లుగాఁ గనబడుచున్నది. కాబట్టి అట్టి యవకాశముగూడ లేదు. అందుచేత తిరుమలరాయని స్థానికపట్టాభిషేకము 1543 లోనె జరిగినదని నిశ్చయమగుచున్నది.

## 6. జీర్ణోద్ధరణము

అళియరామరాయలు రాజ్యములో గొంత స్థిమితిని స్థాపించినాడు. ఇంక బహిశ్శత్రువుల నెదుర్కొనవలెను.

1543 లో అతఁడు, విజాపురసుల్తానును వశపఱచుగొన్న ముదిగల్లు, రాచూరుదుర్గములను గెల్చుకొన్నాడు.

అతని సోదరుఁడగు వెంకటాద్రి అదే రాజ్యములోనిదగు కృష్ణాతుంగభద్రల మధ్యదగు అంతర్వేదిని వశపఱచుకొన్నాడు.[8]

7. ఎపిగ్రాఫికా ఇండికా 4-273 (వసుచరిత్ర విమర్శనము పుట 133).
8. జీర్ణవిజయనగరచరిత్రము (దుంమూరి ఈశ్వరదత్తుకృతము 1927) పు 200.

సీ. పదిలుఁడై రాచూరుముదగల్లు గప్పంబు
సేయఁగాంచ, సపాదసీమ నిలిపె

♦ ♦ ♦

గీ. ..........రామవిభుఁడు,

(నరసభూపాలీయము ఆ 1-82)

రామరాజు, అతని బృందము గలిసి నవాబుల బలమును గౌతమియవతలకు (వసు. ఆ 1-54) గెంటివేసినారు.

తిరుమలరాయల కొడుకైన శ్రీరంగరాజు చాల సహాయపడినాడు. అతఁడు కుంతల, లాట, వత్స, కాంచి, అంగ దేశములను (వసు. 1-73) జయించినాడు. మఱియొక కొడుకైన రామనృపాలుఁడు శ్రీరంగపట్టణమును (వసు. 1-77) జయించినాడు. ఇంకొక పుత్రుఁడైన వెంకటరాయలు (వసు 1-81) చంద్రగిరికోట రక్షణకు నియమింపఁబడినాడు. అప్పటి తిరుమలరాయలయొక్క యుచ్చదశ (వసు 1-15) యెట్లు వర్ణింపఁబడినది- గజపతిగజములను, అశ్వపతి అశ్వములను, నావాడపతి గండపెండేరములను, పాండ్యరాజు బంగారును కానుకలుగా సమర్పించిరి. ఆ దివ్యదశయంతయు తల్లికోటయుద్ధమునకు పూర్వదశయని చెప్పకయె చెప్పుచున్నది. అట్టి గుర్తింపు బహుముఖ్యము. రామరాయల యుచ్చదశయే తిరుమలరాయల యుచ్చదశకదా !

నాశనోన్ముఖముగా నడిచిన కర్ణాటసామ్రాజ్యమును రామరాజు-

తే. గీ. అనఘతర పార్థివేందిక నధిగమించి
సాధుకర్ణాటవిభవ సంస్థాపనము

(వసు. 1-43)

చేసినాడు. 'సకలకర్ణాటకరక్షాధురంధరుఁడు రామవిభుఁడు' (హ. న. 1-53) అయినాడు. అట్లు అతఁడు జీర్ణింపనున్న రాజ్యమును రక్షించి,

జీర్ణకర్ణాటసామ్రాజ్యోద్ధారకుఁ డనిపించుకొన్నాఁడు. ఆబిరుదునే అతని తమ్ముఁడైన తిరుమలరాయఁడు గూడ- జీర్ణకర్ణాటలక్ష్మీపునస్సృష్టి (వసు 1-13) కర్త, అఖిలకర్ణాటరాజ్యపునరుజ్జీవనుఁడు (వసు 1-14), కర్ణాటకాంధ్రధరణీపునరుద్ధారి (వసు 1-90) అనియు తగిలించు కొన్నాఁడు. అది అతనితోఁ బోలేదు. అతని కుమారుఁడు రంగరాయ లను గుఱించి యిట్లు చెప్పఁబడినది-

తే. జీర్ణకర్ణాట భూపునర్జీవనుండు
రమ్యగుణశాలి, (శ్రీరంగరాయమౌళి.)రామరాజీయమున 244)

అది వంశపారంపర్యముగా వచ్చుచున్న బిరుదుమాత్రమె. అట్లు గ్రహింపకున్నచో, సత్యము మఱుగునపడిపోయి, కాలము విష యమై మోసపోయెదము. ఉదాహరణగా మఱియొక బిరుదును గుఱించి చూచెదము. చంద్రగిరిని పాలించుచున్న వెంకటరాయలకు[9] (1605) సకల హిందూరాజ్య సార్వభౌమయను బిరుదున్నది. పోచి రాజు నరసరాజు హిందూరాజ్యసంస్థాపకుఁడు. (నరస. 5-243) అట్టివి వెనుకటివారినుండి వచ్చుచున్న బిరుదులు మాత్రమె. ఈ బిరుదులలో మరియొక రకముగూడ నున్నది. ప్రధాన పరిపాలకుని బిరుదములను గొన్నిటిని సామంతులు ధరించు సంప్రదాయముగూడ నున్నది. ప్రధానపాలకుఁడైన సదాశివరాయలు చక్రవర్తికదా ! అతని బిరుదు లనుగూడ తిరుమలరాయఁడు స్వేచ్ఛగా తగిలించుకొన్నాఁడు-

వీరప్రతాపరాజాధిరాజ, రాజపరమేశ్వర
......తిరుమలరాయశౌరి (వసు 1-13)
చాళుక్యనారాయణాంక (వసు 1-13)
వీరప్రతాప రాజాధిరాజ, రాజదేవేంద్ర,
తిరుమలరాయచంద్ర (వసు 1-62)
మన్నెవిభాళ (వసు 1-87).

(అట్టి బిరుదములెకొన్నిటిని నరసభూపాలీయములోగూడ జూచెదము)

---

9. శాసనపద్యమంజరి, 2 వ. భా. (ఆంధ్రసాహిత్యపరిషత్తు) పు 109.

అటువంటి బిరుదములను జూచి ఆరాజు సర్వస్వతంత్రుఁడనికాని, నిజముగా రాజాధిరాజనికాని, మోసపోరాదు. అట్లు మోసపోయినచో, కాలము విషయమైకూడ మోసపోయెదము. అట్టి బిరుదధారణ, వారికి కేంద్రపాలకుని మీఁదగల నిరాదరణను తెలుపుటయేకాక, దేశములో ఎవరికి వారే పెద్దలమని భావించుచుండి, సామ్రాజ్య విధ్వంసమునకు దారితీసిరని విశదముచేయును. ఆ బిరుదములను గుఱించి వజ్ఝలవారు–[10]"శాసనములలోని బిరుదములు కొన్ని విజయనగరరాజులకుఁ బరంపర్యాగతములును, మఱికొన్ని యళియరామరాజు వంశము వారికిఁ గులక్రమాగతములును నయి యున్నవనుటకు వీరిలో నెవరిని నిర్ణయించినను నీబిరుదులనే యుపయోగించుటయె నిదర్శనము. ఇట్లె కర్ణాటదానశాసనములలోని "వీరప్రతాప రాజాధిరాజ పరమేశ్వరాది బిరుదములును వీరికిఁ బారంపర్యాగతములని గ్రహింపవలసియున్నది" అని స్పష్టపఱచినారు.

తళ్ళికోటయుద్ధసందర్భముగా నీక్రింది రాజకీయకారణములు గనఁబడుచున్నవి. రాయని కాలమున మంత్రిమండలి యేర్పాటున్నట్లుగా కానవచ్చుట లేదు. అతడు నియంతయై వ్యవహరించెను. నవాబులు కలిసి తనమీఁదికి దండెత్తువఱకు నూరకొనక, వారిలో కృతఘ్నుల నొకరిద్దరిని మొదటనె ధ్వంసముచేసి యుండవలసినది. తళ్ళికోటయుద్ధములో హిందువులు పిరికిపందలవలె వెనుకకు పరుగిడి తమ యోటమిని కొనితెచ్చుకొనిరి. [11]విజయనగరరాజులు విజయనగరకోటలోనికి వచ్చి, గవనులను బంధించికూర్చున్నను, నవాబులసేనలు నెలలకొలది వ్యర్థముగా ముట్టడించి, వెనుదిరిగి బోయియుందురు. విజయనగరకోటకు చేరినపిమ్మట తిరుమలరాయఁడు సైన్యములనుకూడ దీసుకొని, శత్రువుల నెదిరింపక, ధనమును మోసుకొని, పెనుగొండకు పారిపోవుటచేత, సామ్రాజ్యపునరుద్ధరణావకాశమును శాశ్వతముగాఁ బోగొట్టుకొన్నాడు. (సశేషము)

---

10. వసుచరిత్ర విమర్శనము (1915) పు 134.

11. విజయనగరచరిత్ర (ఆంగ్లము) బెంగుళూరు సూర్యనారాయణరాయ కృతము 1905 పుట 315 లో అధస్సూచిక.

# తా పో ప శ మ న ము

విద్వాన్, శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి.

ఉ. ఏమని చెప్పనేర్తు హృదయేశ్వర! నా యవమానగాథ, నిం
కేమెయి నోర్తు డెందము దహించు మదీయవిషాదవహ్ని, నీ
పై మరు లుప్పతిల్లఁగ సభాస్థలి నెట్లొ నటించి నిర్జర
స్వామిప్రశంస లంది నిజసౌధముఁ జేరితి నంత నయ్యెడన్. 1

సీ. వనజాక్షి యొకతె సంపఁగినూనెఁ దలయంటి
తడియార్చి దువ్వి క్రొమ్ముడి ఘటించె
జిలుఁగువల్వలను గైసేసి యొక్కపొలంతి
కస్తూరికాతిలకమును దీర్చె
మగువ యొక్కతె మేన మంచిగంద మలంది
మినుకుఁగాటుక వాలుఁగనుల దిద్దె
చెలి యోర్తు రత్నభూషల నలంకృతి సల్పి
హారుముంజిముత్యాలసరు లమర్చె

గీ. త్వరితగతి నివ్విధమ్మునఁ దరుణులెల్ల
మున్నె మామకాభీప్సితమ్మును గ్రహించి
విపులసౌందర్యవతిని గావింప నపుడు
ప్రియసఖిని గూడి నినుఁ జేరఁ బయనమైతి. 2

మ. అలకాపట్టణరమ్యహర్మ్యమున గాఢాశ్లేషసౌఖ్యోన్నతా
కలితుం జేయుకుతూహలమ్మునను మార్గన్యస్తవైరుధ్యమున్
దలపన్ సుంతయు నంతఁ గొంతవడికిన్ ధౌతాచలప్రాంతమం
దల లంకానగరాధినాయకుని సైన్యమ్మున్ విలోకించితిన్. 3

ఉ. దానవు; లాహవప్రియులు ధర్మవిదూరులు కాముకుల్ శఠుల్
కానఁ దదీయసేన కెడఁగాఁ జన శ్రేయ మటంచు నెంచి, నం
దానది కవ్వలం దరులతాసుమశోభితమైన సుందరో
ద్యానవనమ్ముఁ జేరుటయు నందలిదృశ్యము లింపు నింపఁగన్. 4

కం. పులి పొంచియున్న పొదలోఁ
దెలియక చొరబాఱుహరిణి తెఱఁగున నకటా ?
ఖలుఁడు దశాస్యుఁడు గల య
య్యెలదోటం జొచ్చి మిగుల నెల్లిద మైతిన్. 5

ఉ. అవ్వని నిర్గమించుసమయమ్మున రావణుఁ డేగుదెంచి నీ
వెవ్వ తె; వెవ్వనిం గలియ; నెచ్చటి కేగెదు? నీరజాస్య! నీ
జవ్వన; మంగసౌష్ఠవము చక్కనిరూపవిలాసవై ఖరుల్
నవ్వులపాలు సేయక కళానిలయున్ ననుఁ గూడరాదటే! 6

గీ. హరిహరాదులనేనియు సరకుగొనని
శౌర్యగుణధుర్యుఁడను నాకు సాటి యెవరు ?
రావణుం డండ్రు సకలరక్షోవిభుండ
సమ్మతింపవె నాపొందు జలజనయన ! 7

గీ. నిండుజాబిల్లి పండువెన్నెలలు నింప
మలయపవనుండు కమ్మతావులు ఘటింప
మారుబారికిఁ జిక్కితి మనుపఁగదవె!
సందియంబేల ననుఁ గూడ సుందరాంగి ! 8

కం. అని కేలువట్టి నిలిపినఁ
గను లశ్రులుగ్రమ్మ, మేను గడగడవడఁకన్
మన మెరియఁగ గొంతవడికి
ననునయమున నిట్టు లంటి వసురాధిపుతోన్. 9

కం. రంభ యనుదాన మరునిసరంభమునకు
వశ్యులై యిట్లు మాటాడ భావ్యమగునె ?
మీకుఁ గోడల నగుదు క్షమింపుఁ డయ్య !
మాననీయులు మీకోర్కి మానుఁ డనిన. 10

కం. అకటా వికటపుమాటల
నెకసక్కెపువావు లెంచి యింతిరో? నన్నుం
గికురింతువటే? నా సుతు
నకు సతి వౌదువటె? జగము నవ్వదె? విన్నన్. 11

కం. అని నన్నుఁ బరిహసింపఁగ
ధనదుఁడు మాయన్న యతనితనయుఁడు మాకుం
దనయుఁడు నలకూబరుఁ డ
య్యనఘునిసతి నౌటఁ గోడ లగుదును గాదే! 12

చం. పరమపవిత్రమై వెలయు బ్రహ్మకులాన జనించి, ధర్మవి
స్ఫురితము లైనవేదముల పోడిమి నెల్ల గ్రహించి సత్క్రియా
పరతఁ బ్రసిద్ధి గాంచు మిమువంటి గుణాఢ్యులె వావి దప్పినన్
దురితమతుల్ జగమ్మున వధూహితతత్పరులై చరింతురే ? 13

కం. ఇత్తఱి భవత్తనూభవు
చిత్త మెలర్పంగఁ జనుదు సెలవిండు కృపా
యత్తమతి నంచు వేడిన
నత్తులువ సహింప కిట్టు లనియెం బెలుచన్. 14

ఉ. అన్నయుఁ దమ్ముఁడున్ మఱియు నల్లుఁడు మామయు నేమికావలెన్
జన్నము చేసియుండునెడ, సంగరరంగమునం బరాక్రమా
భ్యున్నతిఁ జూపి త్రెళ్లునెడఁ బుత్త్రుఁడుఁ దండ్రియు నేమికావలెన్
పన్నిద వేల? యిట్టిపెడవావులు నన్నుఁ జలింపఁ జేయునే ? 15

కం. అని పలికి నన్ను సాహస
మున నొకపొదరింటఁ జేర్చి భోగింపఁగ న
ద్దనుజాధము మొఱకుఁదనము
గనియును జీవింతు నెట్టికర్మఫలంబో ? 16

ఆ. వె. వానివలన ముప్పు వాటిల్లుటకు మున్నె
మిత్తిమొగమునందుఁ జొత్తు నన్నుఁ

గమలభవుఁ, డమర్త్యకాంతగాఁ సృజియించె
విధివిధాన మనుభవింపవలదె ? 17

కం. నగభేదిపట్టణముపైఁ
బగగొను నెఱజోదువలనఁ బ్రాపించిన నా
యగచాట్లు దెలిపి నీమది
నొగిలించుట కెంతయును మనోహర! వగతున్. 18

కం. అని యిమ్మెయిఁ జింతిలు రం
భను గని నలకూబరుండు బాష్పకణమ్ముల్
తన కేలఁ దుడిచి దానవు
ననుచితకృత్యముల; కాగ్రహాన్వితుఁ డగుచున్. 19

కం. దోయిటఁ బవిత్రగంగా
తోయమును గ్రహించి దోషదూషితుఁ డగుదై
తేయవిభుఁ డన్యకాంతల
చాయకుఁ జనకుండ నప్పుడు శపియించె నిటుల్. 20

కం. "ఒడఁబడని యట్టిపడఁతిని
బొడగని యీ రీతి నెడరు పొనరించిన ని
న్వెడఁగుతలల్ పోడిమి సెడి
పుడమిం బడుఁగాక! వేయిముక్కలుగ వడిన్. 21

కం. అని శపియింపఁగ వనితా
జన మెల్లఁ బ్రశాంతి నందె సంతప్తమతిన్
విని మౌన మూనె రావణుఁ
డనిమిషఘనకుసుమవర్ష మంతటఁ గురిసెన్. 22

కం. ఈ పగిది దనుజనాథుని
శాపించి కుబేరసుతుఁడు సముచితమధురా
లాపమ్ముల రంభాతా
పోపశమన మాచరించి యూఱటఁ గనియెన్. 23

సిరి:-సత్యమే తండ్రీ! తాతగారి పలుకులలో నన్భృత ముండునా ?

చి. మా -(నవ్వుచు) అట్లైన తాతగారూ! నేటినుంటి నాయుద్యమ మును విరమించుకొని హాయిగ సహస్రగాయత్రి జపించుకొనుచు విశ్రాంతి గైకొందును. బాధ్యత గల ప్రభుకుమారుడే తనకర్త వ్యము నెరవేర్చుకొనుట ముదావహము. సత్త్వగుణ మలవరచు కొనవలసిన నాకీ వృథాశ్రమ మేల ?

వృ. మా:-అబ్బా! ఎంతటిదురాశ! ఆంధ్రదేశము నాపదనుండి తొలగించు గౌరవము, కీర్తియు నీకొక్కనికే దక్కవలయునా ? ఆతనికి నీవుగూడ కాసంత చేయూత నొసగరాదా యేమి ?

చి. మా:-(నగుచు) బ్రాహ్మణయువకుడు సంపాదించి యొసగిన రాజ్య మును ప్రభుకుమారుడు స్వీకరింపడేమో యనుసందియము తాత గారూ!

వృ. మా:-(సపరిహాసముగ) నీకట్టిసందియముతో బనిలేదు తాతా! భూమికి కాశ్యపి యనుపేరెట్లు కల్గినది ? మున్ను కశ్యపు డను విప్రుడు పరశురామదత్త మగుభూమండలమును మఱల క్షత్రి యుల కొసంగె నని నీకు తెలియకున్నదా ? బ్రాహ్మణునిగ నున్న నీవు రాజ్యమును సంపాదింపుము. బహిర్గతు డైనపిదప సోమదేవ సుతు డద్దాని పాలించును.

చి. మా:-ఎంత చమత్కారముగ ప్రసంగించుచున్నారు తాతగారూ!

( నే పథ్యమున )

"అమ్మాయీ! నీవచటనే యుంటివి గాబోలును. మీ నాన్నగారి కొఱ కెవ్వరో వచ్చియున్నా రని చెప్పుము."

వృ. మా:-(విని) ఇది శుభసూచికసమయము తాతా! లే లెమ్ము. నీ సందియము లన్నియు దీరుసమయము సమీపించినది. ఆ వచ్చిన వారు ప్రతాపవర్మగారే యైయుండవచ్చును. ఇపుడే నీకు వారితో

బరిచితి గావించెదను రమ్ము. ఆయన యాంధ్రమహాభిమాని. వారి తోడిమైత్రి నీకు ముఖ్యము.

చి. మా:-(లేచి వృద్ధమాధవశర్మతో గూడి నిష్క్రమించును.)

సిరి:— దేవా! సిద్ధేశ్వరస్వామీ! నీవు కరుణించుసమయ మే తెంచినది మహాత్మా!

( తెర జాఱును )

---

# ఆంధ్రదీక్ష

## ద్వితీయాంకము — ద్వితీయ రంగము

ప్రదేశము:-కందారపురమున భీమణవర్మగారి పూలతోట.

ప్రవేశము:-చెన్నబసవడు (ఒక వేదికపై)

చెన్న:-(తనలో) అయ్యో!నాకర్మమే యీ లాగున కాలిపోవలయునా? ఎంద తెన్నిదివాణములలో పనిచేయుటలేదు. ఆబోతు నంటిపట్టు కొనిన జోరీగవలె నయ్యగారిని రేయింబవళ్లు విడువకుండ దిరుగు చుంటచే బెస్తవాడు మొదలుకొని పెద్ద యుద్యోగివఱకు మన మనిన గడగడలాడువారే. కాని యేమి లాభము? ఇంతటి గొప్ప తనమును నిల్లాలికడ గడ్డిపోచక్కైన మారకుండ బోయిన దే! "నాగ రాజు బాబుతోడనే కలకాలము కాపుర మేడువదలచుకొనిన గాడిదకొడుకవు న న్నెందులకు గట్టుకొంటి వని యది య దేపనిగ రాజవీథిలో బడి అంకెలు వేయుచున్నది. నే నేమి చేయవలసినది?

(సోమశేఖరశర్మ ప్రవేశించుచున్నాడు.)

సోమ:-ఏమిరా! చెన్నా! ఏడుపుమొగముతో నున్నా వేమి?

చెన్న:-ఏ మున్నది బాబూ! మా యింటిదానిగోల యెక్కువైనది.

పడుచుదన మంతయు బాబుతోనే వెళ్ళుచున్నపుడు త్రాడు గట్టించుకొనినది తందనాలు త్రొక్కిన దనిన తి ప్పేమున్నది. మీా కేమి ? మీా రదృష్టవంతులు. రాత్రి తొమ్మిది గాకుండగనే తోక జాడించుకొని గూటికి జేరుకొని గువ్వపిట్టవలె నమ్మగారితో నా పలుకీ పలు కాడుచు హాయిగ నుందురు. ఇక నాకా ! ఇల్లు లేదు. ఇల్లాలిమాట లేదు. సంసారము లేదు-

సోము:-(నవ్వుచు) ఊ- కానీరా ! కట్టుకొనినదానికి కడుపువచ్చినట్లు కలగూడ లేదు. పురిటికి వ్యయము లేదు. పిల్లలతో పీకులాట లేదు-

చెన్న:-బాబూ ! మీా కేమి ? నా బ్రదు కంతయు నవ్వులాటగనే యుండును- నారాయణమూర్తీ! నా పగవానికైన నా పాట్లు వలదు.

సోము:-పోరా ! నీ పీతమ్మశోకమున కేమిగాని నాగరాజుబా బిపు డెచట నున్నాడురా !

చెన్న:-ఏమో బాబూ! ఎవ్వరు చెప్పగలరు? పచ్చిపెసలు బడవేయుచు పావురములకడనో- పెద్ద తెరపెట్టలగ్రుడ్ల నణకించుచునో- మిడు తల జంపి పిగిలిపిట్టలనోటి కందిచ్చుచునో- కౌజులకొఱకు చెద గుట్టల ద్రవ్వించుచునో- జాగిలముల బట్టినకొఱుసుల తమచేతు లతో నూడలాగుచునో-జెట్టిపుంజుల యారుల జెక్కుచునో-ఏది యో పెద్దపనిలో మునిగి కొట్టుకొనుచు నుందురు! మ తేమున్నది?

సోము:-(నగుచు) నీ మహోపన్యాసము మండిపోను! ఎంత దండక మేక రువు పెట్టినావురా! చెన్నా! ఇటు విను - పెండ్లికూతురుగారి యర ణపుదాసిముండ వచ్చి "అమ్మగారు రమ్మనుచున్నా"రని యాయ నను లాగుకొని పోయిన దని వింటిని- నిజమేనా!

చెన్న:-(నవ్వుచు) ఆరేండ్లయి యత్తవారింటికి కాపురమునకై వచ్చి యీా యాడంగియయ్యవారితో నింకను కాపురము చేయుటకు

గంపె డాస బెట్టుకొనిన యీ యమ్మ యమాయికత్వమును, నాగరాజు బాబునకు సంసారము మప్పుటకై ముప్పుత్రిప్పుల బడి మూడు చెరువులనీళ్ళు ద్రాగుచున్న మీ పట్టుదలను- జూచిన నేను నవ్వవలయునో- యేడువవలయునో తెలియుట లేదు బాబూ!

సోమ:-ఔనురా! చెన్నా! నీ వేలాగునన్నైనను పెంకిముండకొడుకవు. బాగుగ గనిపెట్టితివి. ఇంతకును నా కుమారవర్మగారి కొమరిత దురదృష్టవంతురాలు. దైవఘటన యట్లున్నది. (ఆలోచించి) అబ్బా! కళాశాస్త్ర మంతయు గడగడ కలలోగూడ నప్పగించునట్లు కంఠస్థము జేయించితిని. ఎన్నియో శృంగారకావ్యముల వల్లె వేయించితిని. తుదకు సిగ్గు విడిచి కోటలోని పడుచుదాసిముండల బిలిపించి వారికి జెప్పవలసినది చెప్పి యీ యయ్యగారిపై నుసికొల్పితిని. ఊఁ హూఁ చలనము లేదు- పులకింపు లేదు- ఏమి లాభము? మిడుతల బట్టుకొనుటలో గలనేరుపు పడతి పైటచెఱగు బట్టుటలో బట్టువడ లేదే- పావురముల బల్లటీల బరికించుటలో గల యేకాగ్రత యాలియాంగికసందర్శనములో సహస్రాంశ మైనను లేదే-పిగిలిపిట్టపింఛము సవరించుటలో నలవడినప్రజ్ఞ పెండ్లికూతురు గారి కుంతలముల గుదురుపరచుటలో గుదరలేదే- ఆరుల జెక్కుటలోగల యాసక్తి యమ్మగారి యధరము నొక్కుటలో లేదే- ఇట్టి యాడంగియవకతవకయయ్యతో- నిట్టి వట్టిబట్టలబండారపు గుమ్మటముతో- నే మేమో సుఖింతు నని యీ యమ్మ యాంతరంగికపరిచారికచే రహస్యవార్తల నంపినదా? ఏమో- మనసు తిరిగిన దేమో- గసగసాలలేహ్యాము కాసంత పట్టిచ్చిన దేమో!

(నాగరాజు కూనరాగముతో ప్రవేశించును.)

నాగ:-ఇదిగో! శర్మా! వచ్చితివా?

సోమ:-ఆఁ ఏలినవారి యానతికి దిరు గున్నదా? (నగుచు) ఈ దినమున బాబుగా రమ్మగారిసన్నిధికి వేంచేసినటు లున్న దే.

నాగ:-ఓ యబ్బ! నీవు నిన్న బోధించినపాఠ మింతలోనే పరాకుపడితి మనుకొంటివా? లేదు- లేదు- ఇది యింతటితో గదలుఘటము గాదు- మా సంగతి నీ వింకను జిత్తగింపలేదు.

సోమ:-ఇది యేమి బాబూ! పెండ్లికూతురుగారి పిలుపు బెడచెవిని బెట్టు డని నే బోధించితినా?

నాగ:-కా దయ్యా! బుద్ధిగలవానికి బోధ లెందులకు? నిన్నటిదినమున మనము చదివిన కావ్యములోని ప్రణయకలహమును నేడు మేమాచరణములో బెట్టితిమి. ప్రభువులము గనుక పెండ్లికూతురుగారి పైననే ప్రయోగించి చూచితిమి.

సోమ:-ఓయి దేవుడా! అదియా బాబూ! ప్రణయకలహ మనగా నా గదిలో- నా శయ్యపై- నటుదెస నమ్మగారు- నిటువైపు మీరును శయనించి యున్నపు డా పరిస్థితిలో- నాలుమగలలో నెవ్వరో యొక్కరు- ఏదో గోరంత లేనిపోని విషయమును గొండంతగ జేసికొని యటు నామె- యిటు మీరు, కాసంత నెడపెడ మొగములు జేసికొని యంతలోనే...

నాగ:-(విసుగుతో) అదియే నయ్యా! మా కర్థము గాకపోలేదు. గది- శయ్య యని సపాదలక్షగ్రంథము జదివెద వెందులకు? అంత గొడవ యక్కర లేకుండగనే వ్యవహారపరిష్కారము గావించి యిట్లు నిర్విచారముగ భీష్మించుకొని కూర్చుంటిమి. ఇంతవఱ కా గదివైపు కాలైన సాగినదేమో చెన్నడి నడుగుము శర్మా! (చెన్నబసవని గని) ఏమిరా? అటు లేడువుమొగముతో నుంటి వేమి?

చెన్న:-చిత్తము బాబూ! ఏలినవారి కా దృష్టియే లేదు. పదిమంది నాటిన తోటలోనుండి మనవి చేయుచున్నాడను.

నాగ:-వింటివా? శర్మా! ఇంత యెందులకు? మా నడుమ రాయబారముల గడుపుట కా పాడుతొత్తుకూతురు నంపుట యెందులకు?

ఆమెయే స్వయముగ దయచేసి యీడ్చుకొని పోజూచినను నీడిగిల బడుదుమే కాని యింటిలోని కేగుదుమా? ప్రభువుల పట్టుదల లంతే- రాచపగ, తాచుపగ యనినారు.

సోమ:-(తనలో) రామ! రామా! ఈ నిర్భాగ్యున కెంతగ బోధించి నను విపరీతముగ పరిణమించుచున్నది. క్రమముగ నా బోధలు తల కెక్కి యేదియో పనికి వచ్చు ననుకొంటిని. ఈ రీతిగ కథ యడ్డముగ దిరిగిన దేమి? ఇట్లు వెఱ్ఱిపట్టుదలతో నీతడు కాలు లోన బెట్టకున్న నెల్లరు నీ పాపపుబండిని నాపై దోలుదురు గదా! నాకు దేవిడీమన్నా తప్పదు. ఆంధ్రదేశీయోద్యమమున కావం తయు నుపకరింపకుందునే! మాధవశర్మగారి మన్ననల కావంతయు బాత్రుడ గాకుందునే! (ప్రకాశముగ) బాబూ! ప్రణయకలహ మనగా తెగువఱకు దెంచుట గాదు. ప్రణయకోపము ప్రళయ కోపము జేయవచ్చునా? ఎన్నిప్రబంధము లేలినవారు చిత్తగింప లేదు. వానిలో పట్టు- విడుపు పఠింపలేదా? కావున-

నాగ:-ఆగుము శర్మా! ఆగుము. అట్లనుచుంటివి గదా. ప్రవరాఖ్యు డను పేరుగలబ్రాహ్మణు, డదునుచేసిన డేగవలె రెపరెపలాడుచు మీదకు వచ్చినవరూథినిని త్రోసివైచి పారిపో లేదా! ఈ విష యము నిన్న మధ్యాహ్నము మనము మార్కండేయపురాణములో చదివితిమా? లేదా? ఆ చచ్చుబాపనిపాటి శౌర్యము మాకు లేదను కొంటివా? మా మాటకు మారు చెప్పకుము- అంతే-

సోమ:-చిత్తము- చిత్తము- శ్రీవారిపలుకులు శిలాక్షరములు. ఈపూట పాఠ మేమిటి బాబూ!

నాగ:-పాఠముల కేమిగాని శర్మా! ఒక్క-సందేహము సెల వీయ దలచుకొంటిని.

సోమ:-చిత్తము.

